# అభినవాంధ్ర బిల్హణీయము

## మంజరీ ద్విపద

(సంస్కృతమూలమునకు అనువాదము)


అనువాదకులు :

విద్వాన్ . రాయరె, తెలుగుపండితులు

నల్లచెఱువుపల్లె, పులివెందుల (తాలూక)



ప్రచురణకర్తలు :

రా. ఉదయభానుదేవరెడ్డి, రా. తిరుమల వెంకటేశ్వరరెడ్డి.

రాయరె కళానిలయము. 1-3019. చిన్నన్నరాముఱువీధి

పులివెందుల-516 390 కడప జిల్లా.

అంకితము ;

నూతన వధూవర యువతీయువకుల
కరకమలములకు







## -: ముద్రణ దోషములు :-

| పేజి | తప్పు | ఒప్పు |
|---|---|---|
| VIII | సమానోను | సమానాను |
| IX | అన్నటొప్పు | అన్నట్లొప్పు |
| X | మంజరి | మంజరీ |
| XI | చిచించసంగిరే | చిచ్చసంజగదిరె |
| XIII | స్రిదశా | స్త్రిదశా |
| 1 | తొగరు | ఈపదముఅధికము |
| 2 | రమణిరూపె | రమణీయరూప |
| 2 | అమాత్యాన | అమాత్యాని |
| 5 | ఉత్తదర్ద్వార | ఉత్తమధనుర్ద్వార |
| 6 | దిన్నాల్లు | దిన్నాల్లు |
| 6 | ఏయూరమీది | ఎయూరమీది |
| 7 | సన్నిధిచే నోనెవెట్లు | సన్నిధి నేవెట్లు |
| 7 | మనదేసెము | మనదేశము |
| 8 | కౌమరిత్త | కౌమరిత |
| 9 | అందుకామె | అందులకామె |
| 9 | ఏరాజా ! | ఓరాజ ! |
| 9 | లలితకలలు | కళాకలిత |
| 12 | యిల్లు | యిట్లు |
| 13 | శౌబించు | శోభించు |
| 21 | ఎవ్వరికనిచ్చిన | ఎవ్వరికచ్చిన |
| 22 | ఆగనామణి | అంగనామణి |
| 22 | శృంగలా | శృంఖలా |

| పేజి | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 22 | నీగసబదుడైన | నిగలబద్ధుండైన |
| 25 | లందున | లందున్న |
| 28 | బట్టి | బెట్టి |
| 30 | కందంబు | కంఠంబు |
| 32 | శబ్దబులు | శబ్దంబులు |
| 33 | లాయె | లావె |

ఇంకను దోషములు పాఠకులు గమనించి తెలిపిన తదుపరి ముద్రణమున సరిచేయగలము

ముద్రితములు :

1. ఎల్లారెడ్డి గాయాలు
2. అభినవాంధ్ర బిల్హణీయము

అముద్రితములు :

1. ఎల్లారెడ్డి భావాలు (నాటికలు)
   1) పురోగతి
   2) తప్పెవరిది
2. కఱువు (నాటకం)
3. ఆంధ్రప్రదేశావతరణము(బుఱ్ఱకథ)
4. ఆధునిక ఆంద్ర మేఘధూతం
   (కాళిదాసు మేఘసందేశమునకు స్వేచ్ఛానువాదం)

## —: మున్నుడి :—

నేను తిరుపతి శ్రీ వెంకటేశ్వర ప్రాచ్య కళాశాల యందు (విద్వాన్ A, సంస్కృతము మఱియు తెలుగు చదువునపుడు అచ్చటి ప్రాచ్య పుస్తకభండాగారమునకు పోయి చదువుకొనుట కొన్ని పుస్తకములనుచూచుట తటస్థించినది. సంస్కృతములో నున్న బిల్హణ చరితమునుచూచి అందులోని శృంగారమును వర్ణనను తెలుగులో అనువదించిన బాగుండునని తోచినది. కారణము నేను బాల్యదశనుండి యౌవ్వనమున నడుగిడు సందర్భముగాన శృంగారభావములు నన్నాకర్షించినవి.

కాశ్మీరదేశమున బిల్హణ, మల్హణ, కల్హణులను కవులుండి రనియు వారుకొన్ని గ్రంథములను వ్రాసిరనియు చరిత్రకారులు వ్రాసిరి. కాని ఈ బిల్హణ చరితము బిల్హణుడే వ్రాసినాడా! లేక అతనిపేరున కల్పితమైన ఈ కావ్యమును మరెవ్వరైనా వ్రాసినారా అను విషయమునకు సమాధానము నాకు దొఱకలేదు. ఈబిల్హణీయమును పద్యకావ్యముగా చిత్రకవి సింగనార్యుడు రచించినట్లు విని దానిని తీసుకొని చదివితిని. అందు పుస్తకములో మాత్రము చిత్రకవి సింగనార్య విరచితమని ఉన్నది కాని లోపల కవివంశమును ఈరీతిగా వ్రాసియుండుటను బట్టి, దీనిని కృష్ణస్వామి రచించినట్లు సింగనార్యసూనుడు నారసింహార్యకవి సాయముచేసినట్లు తెలియుచున్నది.

తే॥ చిత్రకవివంశ దుగ్ధాబ్ధిశీతభానుఁ
దనుమానోక్తి శ్రీ సింగనార్యసూనుఁ
దమితకవితా విశేషజ్ఞుఁడనగవెలయు
నారసింహార్య కవివచ్చి నన్నుమెచ్చి

క॥ శ్రీపండితపెద్ది సత్కుల
దీపక కాశ్యపసగోత్రదివ్యాన్వానా
భూపాలకమకుటమణీ
శ్రీపదపాదాగ్రభూమి కృష్ణస్వామీ!

సీ॥తే॥ కావ్యనాటకలు సదలంకార చతుర
సాహితీమహసన్నాహ సరస హృదయ
పండితపెద్దకులీన సంపన్నిధాన
పాలిత కవీంద్ర శ్రీకృష్ణపండితేంద్ర

వ॥ అని వినుతించి ఒక్క పురాణకథ నాంధ్ర ప్రబంధంబుగా రచించి రామాంకితంబుచేసి యాచంద్ర తారకంబగు సత్కీర్తింగాంచు మనిన నేనును సంతోషాంతరంగుండ నగుచు.

క॥ మునీంద్రతనూభవునకు
వెన్నుండు సహాయమైన విధమున నేనా
సన్నుత సద్గుణ సం
పన్నుండా కవిరాధిప సాహాయమునన్

పై పద్యముచే శ్రీకృష్ణపండితుడు ఈ గ్రంథమును వ్రాసినట్లు తెలియుచున్నది. చిత్రకవి సింగనార్య కుమారుడు నారసింహకవి కృష్ణపండితునకు సహాయపడినట్లు తెలియుచున్నది. ఆశ్వాసాంతమున నే కవిపేరు పేర్కొనలేదు. ఇట్టి సందేహము చాలా గ్రంథముల విషయాలలో కలదు. దానిని విమర్శకులు చర్చింతురుతెమ్ము.

## —; అనువాదము :—

మూలములోలేవి ప్రార్థన. రామునకు నమస్కారములు. అంకితము. సుకవి భూషణ కుకవి దూషణములు, స్వీయచరిత్ర వర్ణనము. షష్ఠ్యంతములు, పురవర్ణన, చాతుర్వర్ణవర్ణనము, పుష్పలావికావర్ణనము. బిల్హణవర్ణన, (మృగములలో సింహము అవనీంద్రులలో రఘురామమూర్తి అను పద్యము)చేసేను. బిల్హణుడు రాజుపిలుపు నందుకొని శిష్యులతో వచ్చుచుండ స్త్రీలువర్ణించుట కలదు. కాని మూలములోని రాజకవి సంభాషణలేదు ఆశ్వాస విభజనచేసి విద్యలను నేర్చుకొనుటతో ప్రథమాశ్వాసమును ముగించెను.

## —: ద్వితీయాశ్వాసము :—

మూలములోలేని వసంతవర్ణన. సూర్య చంద్రోదయవర్ణన యామినీ పూర్ణతిలక ఉద్యానవనవర్ణన, ఆమెకల. చెలికత్తెల ఓదార్పు. తిలక సర్వావయవవర్ణన, కవిచేయుట, పరస్పరవర్ణన చుంబన, పూత్కృత, భూత్కృత, హుంకృత. గృహాణ. ముంచ అనినాగ. సింహ, కుక్కుట, హంసాది, బంధ విశేషంబులతో వర్ణించుటతో రెండవ ఆశ్వాసము ముగియును.

## —)( తృతీయాశ్వాసము )(—

ఇచ్చటకూడ మూలములో లేని కామినీకవి సంగమమును గూర్చి చెలులు చర్చించుకొని రాజునకు చెప్పుట, యామినీ పూర్ణతిలక నిర్దోషినని తండ్రితోచెప్పుట, శిక్షవిషయమై సభలోచర్చించుట, శిక్షించక పరదేశమునకు పంపమని తండ్రితోవేడుకొనుట,

తప్పంతయు తనదేననియు బ్రాహ్మణుని శిక్షింపరాదనియు చెప్పినను తండ్రి తిరస్కరింపగా కవి వెంటబోవుచు తనభాగదేయమును ధూషించుకొనుటకలదు. ఇంద్ర, చంద్రులుచేసిన తప్పిదములు తెలుపుచు పురజనులు పరస్పరము, బిల్హణుని శిక్షింపవలయుననియు. రక్షింపవలెననియు వాదించుకొనుట మూలములోలేదు. బిల్హణుడు స్మశానమున చెప్పిన వర్ణించిన పద్యములను రాజుకుచూపగా అతడు మన్నింపలేదు, తరువాత నొక పద్యమును (దివిజుడు భాగుణింప విధురంబుగభట్టినశించె) వ్రాసిపంపగా రాజు స్వయముగాపోయి కవినితోడ్కొనివచ్చి పెండ్లి చేయుట, వారికి పుత్రుడు పుట్టగా జాతకర్మాదులుచేసి పట్టముగట్టుట మొదలగునవి మూలములోలేనివి చేర్చెను. నేను అనువదించిన గ్రంథమును చదివినచో మీకీవిషయములు గోచరించును

ఈ పద్యకావ్యములో కొన్ని మనోహరమైన పద్యములు జనులు వాడుకొనునవి కలవు. అవి చాలాబాగున్నవి.

శా॥ అంధుండెక్కడ చంద్రుడెక్కడ తదీయంబైన యావర్ణనా
బంధంబెక్కడ. నిట్టివింతగలదే భావింపనెచ్చోటనై
నం! ధాత్రీంద్రుడు మాకునిర్వరకు నందంబొప్పనన్యోన్యహృ
త్సంధానంబగునంచుజేసె నిటులంజర్చింపవేఋన్నదే

మ॥ ఉరువక్షోజయుగాంతర స్థమయి నాయుల్లంబురాదేమి! త
ద్ధర సంస్పృష్టి నశించెనో విరహసంతాపాగ్నిచే గ్రాగెనో!
స్థిరలావణ్య సుధాసరోవరరసాప్తిన్మగ్నెనో ! కామత
స్కర వీరుండు హరించెనో! నవవయః కాంతారసంచారుడై.

ఉ॥ తామరసాక్షినీ నిశితదారుణ వీక్షణతీక్ష్ణబాణముల్
వేమరునాటి నాహృదయవీథి వ్రణంబొనరించెజూడుమా
నీమెయినౌషధ ద్వితయమియ్యవె త్రావెదపూతపూసెదన్
నీమధురాధరామృతము నీకుచకుంకుమ పంకమేర్పడన్

మొదలగునవి నేను అనువదించిన గ్రంథములోని కథతెలిపినచో మీకు రెండింటిభేదము స్పష్టమగును.

భరతదేశమునకు బొడ్డువలె దేశ మధ్యభాగముననున్న దేవతానగమగు మేరుపర్వతముగలదు. దాని కుత్తరభాగమున సర్వసుఖములకు నిలయమైన పాంచాలదేశమందు గలదు. అట సర్వశాస్త్ర పారంగతులగు కవులు పండితులు, గాయకులు పెక్కురుగలరు. ''లక్ష్మీమందిరమను పట్టణము ఆదేశమునకు రాజధాని, రాజశ్రేష్ఠుడగు ''మదనాభిరామ'' నృపతి ఆదేశపురాజు అతనికి "మందారమాల" అను పేరుగల పట్టపురాణిగలదు. వారికి "యామినీపూర్ణతిలక'' అను కుమారీరత్నముదయించెను. ఆమె శుక్లపక్ష చంద్రునివలె దినదినాభివృద్ధిజెందుచు యవ్వనమునందడుగిడెను. కోకిలకంఠియు, సంగీతసాగర శశికళయు నగు తన పుత్రికనుజూచి సాహిత్యము నేర్పింపవలెననువాంఛ రాజుకుకలిగినది. అట్టి అనన్యలావణ్యవతికి సాహిత్యమునేర్పగల కవిఎవ్వరని రాజు మంత్రిని ప్రశ్నించగా బిల్హణ, మల్హణులను కవులున్నారు. వారిలో బిల్హణుడు సాహిత్యవేత్త. ఉత్తమకవియని మంత్రినుడివెను. రాజుబిల్హణుని పిలపించెను. అతని అందచందములకు ఆశ్చర్యపడి అతని కుశలప్రశ్నాదికములతో పలుకరించి తగిన బహుమానములిచ్చి పంపెను, మహామంత్రితో ఇంత సౌందర్యముగల కవియొద్ద నాపుత్రికకెట్లు విద్య నేర్పింపవలెనని

రాజు ఆలోచింప మంత్రిఒక యుక్తిచెప్పెను. వీరిరివురకు రెండు వ్రతములు గలవు. రాకుమారి పుట్టుగ్రుడ్డిని చూడదు. కవి కుష్టు రోగిని చూడడు. కవి గ్రుడ్డివాడని రాకుమారికి, రాకుమారిణి కుష్టురోగిఅని కవికి చెప్పి మధ్య తెరగట్టి విద్య నేర్పింపవచ్చుని సలహాయిచ్చెను.

మంత్రి బుద్ధికుశలతకుమెచ్చుకొని రాజు ప్రాసాదమున తెర కట్టించి విద్యారంభము చేయించెను. తెరకీవలనుండి కవిచెప్పగా తెరకావలనుండి రాకుమారి విద్య నేర్చుకొచుచుండెను. అన్నిట రాకుమారి కవిరాజును మించిపోయెను. ఇట్లు కొన్నాళ్లు గడువగా ఒకనాడు చంద్రునిజూచి కవి వర్ణించుచు సుందరీ చంద్రుడెంత సుందరముగా ఉన్నాడో చూడుమని సంబోధించి చంద్రుని వర్ణించెను. అంధుడెక్కడ చంద్రుడెక్కడ గ్రుడ్డివాడు వర్ణించు టేమిటని తెరపై గడ్డముమోపి నవమన్మథుడైన కవిని చూచెను. తెరపైనున్న కన్యకాముఖమునుజూచి కవియు ఆశ్చర్యపడెను. ఇరువురు ప్రేమించుకొనిరి. మన్మథ యుద్ధము జరిగినది. ఈ రహస్యము చెలికత్తెలవలన రాజునకు తెలిసినది. రాజు మండి పడి కుమార్తెను పిలిపించి నా వంశకీర్తిని నాశముజేసితివని దండించెను. కాని ఆమె నాన్నా మీరుకట్టిన కాండపటమే మాకు కళ్యాణపటము ఇక పరితాపమెందులకనెను. రాజు పుత్రికతో పోయిన పోనిమ్ము ఇకపైన దూరముగా నుండుము. నిన్నొక రాజుకిచ్చి పెండ్లిచేసెదననెను, అందులకామె అంగీకరింపలేదు. ప్రభువు కోపించి కోటిపాలుడను కొత్వాలును పిలిచి బిల్హణుని చంపమని చెప్పెను. పుత్రిక దుఃఖించినను, మంత్రి శాంతతరచి నను రాజు అంగీకరింపక శిరచ్ఛేదము జేయుమనెను, భటులు

కవిని బంధించి రాజవీధినుండి తీసుకొనిపోవుచుండగా ప్రాసాద ములో నుండి రాకుమారి దుఃఖించుచుండజూచి కవి ఓదార్చి వధ్యభూమికి పోయెను. అచట దిక్కులుచూచి తలవంచి ఖండిం చమని చెప్పెను. తలారులు తలనరకమని చెప్పెదవు నీకు దుఃఖము రాలేదా అని ప్రశ్నింపగా అప్పుడు ''తిలకను నఖశిఖ పర్యంతము వర్ణించి అట్టి సుందరిచేసిన చేష్టలు నా మదిలో మెదలుచున్నవి. ఇక నాకు బాధ ఎందుకు''కలుగునని వారి ఆట పాటలు శృంగారజీవితమంతయు యేకరువుపెట్టెను. కోటిపాలుడు కవి వర్ణన వారి ప్రేమకేళి రాజునకు చెప్పెను. రాజు కవిని మన్నించి వారిరువురకు వివాహము గావించెను. కథ చిన్నదైనను కావ్యము రసవత్తరముగా సాగినది, వర్ణన పదలాలిత్యము చుంబనాలింగనాది కామక్రీడలు నేటి విచ్చలవిడిగా నటించు సినిమాలకంటె ఎక్కువగా ఉన్నవి. ఇంత అసభ్యముగానున్న కావ్యము నెందులకు అనువదించితినని తలంచి 40 సంవత్సర ములు మూలపడవైచితిని. కాని నేటి యువతీ యువకులకు అట్టిచేష్టలే సంతోషకరముగా నుండుట గమనించి సద్యఃపరవృతి దీనివలన సాధింపవచ్చని ప్రకటించుచున్నాను.

## -: పరిచయ వాక్యములు :-

కావ్యము—దాని ప్రయోజనము ;

''విశ్వశ్రేయః కావ్యమ''ను- సూక్తి నా యీ చిన్నపొత్త మున కెంతమాత్రము సరిపడదు. విశ్వ, కావ్యసమస్యలే లేవు గాన. విశ్వమన, కేవలము భారతదేశమునకేగాదు సర్వప్రపంచ మున కర్థము. విశ్వశబ్దముగూడ సర్వపర్యాయవాచియే.

ఇక కావ్యప్రసక్తిగూడ నంతకుమునుపే లేదు. చతుర్వర్గ ఫలోపేతము, చతురోదాత్తనాయకముగాదుగాన తనయొద్ద విద్య నభ్యశించు బాలికను గామించిన నాయకుడెంత చతురోదాత్తుడు. అవినీతిని నిరూపించుట నెంత చతుర్వర్గ ఫలోపేతము.

ఒకవేళ విజ్ఞానులు వివేకముతో పరిశీలించిన కొద్దిపాటి ప్రయోజనకారి యగునేమొ, "కవయతీ కవిః తస్యకర్మ కావ్యమ"ను విద్యాధరుని కావ్యలక్షణ ప్రకారము నా యీ చిన్నిపొత్తముగూడ కావ్యమగునేమో? అట్టితతి "కావ్యం యశశే అర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే, సద్యః పరనివృతయే కాంతాసంహితతయోపదేశయుజే" యను కావ్య ప్రకాశకారుడగు మమ్మటాచార్యుని కావ్యప్రయోజన శ్లోకానుసారము, సర్వతో ముఖ ప్రయోజనముగలుగకయున్నను, సద్యఃపరనివృతత్వము మాత్రము కొంచెమైనను సిద్ధించుననే నా విశ్వాసము.

ఆసద్యఃపరనివృతత్వముగూడ ప్రాంతీభాషలో రచించినది గాన, నే నందివ్వగలిగితంత వారికి, అందును చదివి యర్థము జేసుకొనగలిగినంత వారికి విశేషించి శృంగార రసప్రియులగు యువతీ యువకులకు, ఆంధ్రరాష్ట్రములోని యొక ప్రాంతపు మారుమూల కొద్దిపాటివారికి కొంచెముమాత్రముకలుగునేమొ.

"నాయకస్యకవేః శ్రోతుః సమాచోనుభవోమతః" యన్నట్లు నాయకునకు, కవికి, పాఠక, శ్రోత వర్గమునకు సమానానుభూతి యున్నయడల నది యెట్టి గ్రంథమైనను, యేరీతి రచించినను రుచించక మానదు. అట్లుగానిచో "అరసికస్య కవిత్వనివేదనం శిరసి మాలిఖ మాలిఖ" మాలిక, యన్నట్లే యుండును.

ఈ గ్రంథముమజదివి యావేశముతో దాని ననుసరింతురనునది, భారతమును జదివి ద్రౌపదివలె నెంతమంది ఏకకాలమున నైదుమంది భర్తలను వరించిరో, కీచకుని ఎంతమంది యనుస రించిరో, కౌరవ పాండవ యుద్ధయువలన అన్నదమ్ము లెంత మంది యట్లు గావించిరో, రామాయణమునుజదివి వాలి, సుగ్రీ వులవలె, రావణ, కుంభకర్ణులవలె ఎంతమంది గావించిరో యా రీతిగనే యుండును.

ఒకవేళయనుసరించినను. వివేక విజ్ఞానములతో ప్రవర్తించి సాహిత్య, సంగీత, రూప, వయోలావణ్యములందు సమానతగల్గి **వివాహశ్చ** వివాదశ్చ సమయోరేవశోభతే" యన్నటొప్పు, యువివావిత స్త్రీ పురుషులు వరించుకొని ప్రాణమును వదలుట కైనను సమ్మతించి ప్రేమను వదలుటకు సమ్మతింపని, యువతీయువకుల వివాహము జరిగిన నదియే యుత్తమోత్తమము "ఏకోహిదోషోగుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః, యన్నట్లు సిరిలేనంత మాత్రమునందకు్కవగాదు. అట్టిసంబంధ ములు బహుశా, తల్లిదండ్రుల యనుమతితో జరగవు, అట్లుజరి గినచో నాయీాకృషియు, విశ్వస్రష్టసృష్టియు, కృతార్థతబొంద గలవు.

:-కావ్యరచనోద్దేశ్యము-దానివరిణామము -:

బిల్హణీయతో నాకు విద్యార్థి దశయందే పరిచయము. సంస్కృత బిల్హణీయముతోబాటు నాంధ్ర బిల్హణీయమునుగూడ జదివితిని, కాని, నాకు సంస్కృత బిల్హణీయయే యెక్కువ రుచించినది.

అప్పటినుండియు దానినాంధ్రమునకు తర్జుమాజేయవలయునను యాశయము గలదు. కాని దాని నిదివరకే రచించిరి గదా మఱల చర్విత చర్వణము, పిష్టపేషణమెందులకని నిరుత్సాహ పడుచుంటిని. అయినను గ్రామీణుల కందుబాటులో నున్నట్లు జానపద గేయములగా రచించి, ఆమ్మలకక్కలు, కోతకోయునపుడు మొలకనాటునపుడు పాడుకొనుట కనువగునట్లుజేయ నిర్ణయిందు కొంటిని.

అందుకొఱకే ఛందస్సునుగూడ మంజరిద్విపదనుగైకొంటిని అమ్మవారిని జేయాబూని అంజనేయుని జేసినట్లు సరలముగా నందఱకందుబాటులో నుండునట్లు రచింపనుద్దేశించి, చివఱకు సంస్కృతపద భూయిష్టమై రసిక వర్గమున కనువగునట్లు రచించితినినేమో!

ఇందులో శృంగారము మిక్కుటముగాన నెక్కుప తేటతెల్ల ముగానున్నచోనది విరసమగునేమోయని మర్మముగా నుండిననే దానియందభిరుచి యుండునను తలంపుచే నిట్లుగావించితిని.

ఆంధ్రబిల్హణీయ మిదివఱకేయున్నందువలన, అభినవ యను పదమును ముందుంచితిని, సాంఘిక రచనలతో పురోగ మించు యీ సమయములలో నిట్టి రచన అప్రస్తుతమనితోచక పోలేదు. అయినను దాని యందలి యభిరుచి నన్నిట్లనువదింప బూనజేసినది. అప్రస్తుత రచనగావించినందులకు, అభినవాభ్యు దయ సాంఘికకవులు, శృంగార రసవిముఖులు, ఆపవర్గమార్గాను యాములునగు కవులు నన్ను మన్నింతురుగాక.

# XI

-; అనువాదము-దానియందలి విశిష్టత -;

మాతృకవలె సర్వాంగసుందరముగా నమవదించగలవారు కవిత్రయు, పోతన, శ్రీనాథులే, వారికే ఆకీర్తి దక్కినది. తదితరులెంతమంది అనువదించినను "ముక్కస్య ముక్కార్థ" యనునట్లే యుండును. నాయీ అనువాదముగూడ నీతెగకు జెందినదే.

మాతృకయందు సైతము కథయందు-విశిష్టత లేమింజేసి, వర్ణనాచాతుర్య మెక్కువగా ఉపయోగించినట్లును, పద, భావ. పౌనరుక్తి అధికముగానున్నట్లుగనుపించును. చంద్రునివర్ణనలోను "యామినీపూర్ణతిలకను" వర్ణించుటలోను, ప్రియురాలి చేష్టా ముఖేక్షణాదిస్మరణలోను శబ్దార్థ పౌనరుక్తులు గనుపించును.

ఈ గ్రంథములోని పాత్రలనామములు నగరాదుల నామములు, గ్రంథనామము, పోకడలు గమనించి చూచిన కల్పిత గాథయని తప్పక బోధపడును. నాయనువాదములో కొంతవఱకు పునరుక్తులను పరిత్యజించితిని, చంద్రుని మచ్చనుగురించి ;

"నక్షత్రేశత్వదుదరగతం చిహ్నమేకంవటద్రుమం
భాషంతేన్యేశశకమపరే కోమలాఙ్గంచమూారుం"

అనివర్ణించి వెంటనే మరియొక పద్యమునందదే భావమును పదాను ప్రాసతో

"అంకంకేపి శశంకిరే జలనిధేః పంకంపరేమేనిరే
సారంగం కచిచించ సంగిరే భూచ్ఛాయ మైచ్ఛన్‌పరే"

అనివర్ణించియున్నాడు. అటువంటి శబ్దమాధుర్యమును అనువాదమునగూర్చుట కష్టతరము. స్వేచ్ఛాగ్రంథములో గూర్చుకొనవచ్చునేమో. తెనుగుననటువంటి పదములుండుట అరుదనినగూడ నసత్యముండదేమో.

మఱియొకచోట 'యామినీ పూర్ణ తిలక' యుపరితిని కవి వ్యంగార్థముగా నిట్లువర్ణించియున్నాడు.

1. "మేఘోవర్షతిమీనకేతు విశిఖానభ్రంస ముత్క్రాంపతే
ధత్తే మౌక్తికజాల మిందిరయతే తారల్యమిందీపరే
శంఖశ్శాను కరోతిహస్త శనకైః పారావతప్రక్రియాం
తారంభ్రామ్య తిచక్రవాకయుగళీ చిత్రంవిధానం విధేః

ఈభావానుకరణమే మఱియొక శ్లోకములో పదవైపరీత్యముతో జేసియున్నాడు.

2. దాయాదాః శరదిందుకాన్తి ధవళాశ్చంద్రం పరిష్కుర్వతే
శఙ్ఖస్య, ఆశయసంభవాఙ్కయుగళీప్రాప్నోతి సంకోచితాం
నృత్యన్తి ప్రతిపక్షవస్తునివహామాయాగృహేతేజసాం
కేశాన్తే గిరిధన్వనః శమయతే ఖేదంగభీరావటః

ఈ వ్యంగార్థమునే, నేను వాచ్యార్థముగా

కొప్పులోనున్నట్టి - క్రొవ్విరుల్ జారె
మందమందంబుగా - మధ్యంబుగదలె
మోమునజెమటలు - మొలకలువేసె
గన్నులు మెలమెల - గదలుచునుండె
గొంతుకపోతంపు - కూతనువేసె

చనుగవ మిక్కిలి – చాంచల్యమొందె
మీనేక్షణములు ని – మీలితమయ్యె
వక్త్రంబుపై వాల – భారంబుగదలె
నడుమున లోతైన – నాభిచెన్నొందె"

యనియనువదించితిని. ఈభావమునే మఱిరెండు శ్లోకములతో జెప్పియున్నాడు.

"భ్రాన్తిపయః పరిణామా ప్రసిదశాహారే తదీయసూతిగృహాత్
ఉచ్ఛలతి కోపినాదః తద్గుణినిభ్రమతిగిరి యుగంచిత్రమ్"

అచిరరుచా విలసన్త్యా
అమృతముచా భావిపుర్మబిందుముచా
పయోముచా ప్రసవముచా
వికచాకించాపితారహారముచా

అని ఈరెండు శ్లోకముల భావమును నేనొకేసారి (వచ్చినభావమే గాన) వ్యంగార్థముగా నీరీతి జెప్పితిని.

పురుషాయితమునకు – బూనినయపుడు
తటిదంతనంతట – తాండవమాడె
చంద్రుండు ఘర్మాంబు – జాలంబువదలె
వారిదములు సుమ – వర్షంబుగురిసె
తారహారమువీడె – తారాపథంబు

ఇంతకుమించి మాతృకలోని యనుప్రాసను గూర్పజాలనైతి! ప్రియురాలిని దలంచుఘట్టములో పలుమారుచెప్పిన కన్నులను ముఖమును, చేష్టలను రెండు మూడుచోటుల యనువదించలేదు. సాధ్యమైనంతవరకు యెక్కువభాగమును వదలక సమగ్రముగా

తర్జుమాచేసితిని. ఇట్లే యనువాదమున నేనెంతమాత్రము కృతకృత్యుడనైనది. యుభయభాషావేత్తలగు కవివరులు దయతో జూతురుగాక.

విమర్శకాగ్రేసరులు జేయవలసిన పనిని కొంతవరకు నేనే నిర్వహించినందులకు వారిని క్షమాపణవేడుచు పాఠకుల కంతరాయము కల్గించు నీయతిప్రసంగమునుండి తొలగుచున్నాను.

ఇట్లు రచయిత,

**రాయురె**



# అభినవాంధ్ర విల్హణీయము

విజయ విజయకారీ విశ్వవిజ్ఞానధారీ
జయవిజయ విధాతా జన్మదో మన్మథస్స్యా
జయతుజగదీశేషం. సర్వమాంధ్రప్రదేశం,
రసమయసుకృతికర్తా, "రాయరే" వీరపుత్రః

కమల జన్ముండేల - కమలాక్షుడేల
విషమ లోచనుడేల - వేరొక్కడేల
యువకుడా? నీతోటి - యువతీలలామ
ప్రతి నిమేషంబున - ప్రబలుచునుండి
బాహుమూలములారయు - పాలిండ్లచేత
త్రుటిత కంచుకమైన - తొగరుతొలిజవ్వనంబు
సేవ్యమారాధ్యము - సేవింపుమెపుడు
భూమండలమునకు - బొడ్డుగానున్న
అమరాలయంబున - కా ప్రక్కయందు
సర్వకోవిదసాధు - సంపూజితంబు
పాంచాలమనుపేర - బరగుదేశంబు
నందు "లక్ష్మిమంది" - రాజ్యసౌపురము
కలదశేషసుఖాలు - గలిపట్టణంబు
"మదనాభిరామనా - మంబుచేనొప్పు
రాజశేఖరుడైన - రాజందుగలడు
సుగుణాల వాలయు - సుందరీమణియు

"మందారమాల"యే - మహిషియాతనికి
అసతీపతులకు - నానందమూర్తి
నిర్నిద్రమతి"యామి - నీపూర్ణతిలక"
కలదు వన్నెల చిన్నె - కన్నెలమిన్న
ఆతన్వినవయౌవ - నారూఢగాగ
మధురవాగ్విభవంబు - మందహాసంబు
సౌభాగ్యభాగ్యముల్ - సౌందర్యగరిమ
ఆ కర్ణ విశ్రాంత - మౌనేత్రయుగళి
ప్రాగల్భ్యగర్వంబు - పలుకుపాటవము
రమణీ రూపకా - గ్రసికభావంబు
మహితబాలమరాళ - మందరగతియు
కర్కశద్విపకుంభ - ఘన కుచద్వయము
రాకానిశాకర - రాజితాననము
అలికులనీలాకు - లాలకాకృతియు
పరిణతారుణబింబ - ఫలసదృశోష్ఠ
మొక్కసారిగభామ - కుదయించెగాదె
కలకోకిలారవ - కంఠస్వరంబు
సంగీతసాగర - శశికళయైన
యాత్మపుత్రినిగాంచి - యువనీవిభుండు
సాహిత్య ముండిన - సౌఖ్యంబుగాన
కావ్యనాటకవేత్తి - గావలెనంచు
తలచి యమాత్యుని - తలపెరుంగుటకు
ఆతని బిలిపించి - యనియెనీకీతి
సంగీతశాస్త్రంబు - చక్కగానేర్చె

విష్ణాతమతి "యామి – నీ పూర్ణతిలక"
సాహిత్య విద్యయా – సమకూరలేదు
కానసాహిత్యంబు – గరపింపవలయు
ఆసన మంతయు – నక్షిద్వయంబు
బాహుమధ్యంబంత – పక్షోజయుమను
మధ్యమాకాశంబు – మణివిద్యనేర్పు
సామర్థ్యముండెడు – చతురుడెవ్వండు
అని రాజు పలుకగా –

నాయమాత్యుండు
దేవరయీయూర – ద్విజకులజాత
పండితశ్రేష్ఠులు – పలువురున్నారు
వారలలోకవి – వరుడున్న యడల
నియమింపవలెవిద్య – నేర్పింపననిన
అటులనేయనిభూపు – డాయూరనుండు
సకలశాస్త్రంబులం – జదివినవారిం
బిలిపించివరుసగా – బేరెత్తి పిలిచి
వేదితంబైనట్టి – విద్యయేదనిన?
బుద్ధిగల్గినయట్టి – భూసురులంత
కఠిన తర్కంబు నా – కంఠస్థమయ్యె
మీమాంసకంతకు – మేటి నేనైతి
వ్యాకరణంబున – కాకరంబేను
సకలపురాణముల్ – జదివితినేను
వేదాంతమంతయు – విశదంబునాకు
వేదంబుజదివెడి – విధమునాసొత్తు

పదముల విభజించు - పద్ధతినాది
ముందువెన్కలజెప్పు - మొనగాడనేను
ఆరోహమవరోహ - మంతనావశము
కల్పశాస్త్రంబంత - కనుగొంటినేను
కల్పోక్తకర్తల - కరమునేజేతు
వక్తృత్వముననేను - వన్నెకెక్కితిని
యనియొక్కరొకరని - రందున్నవారు
విద్వాంసులారమీ - విద్దెలనెల్ల
వినిపింపనంతయు - వింటిమీరింక
నవరసాలంకార - నైపుణ్యమొప్ప
సాహిత్యపద్ధతుల్ - జక్కగానేర్పి
కావ్యనాటకముల - గఱపినాకూతుఁ
గవయిత్రిజేయుడు - గరుణతోననిన
నవరసాలంకార - నైపుణ్యమంత
మాకేడ, దానిలో - మర్మంబులన్ని
కవులమా? మేమెట్లు - కనుగొనగలము
కవనంబురాదమీకు -

- అనినవారనిరి

ఛాంధసులకుమాకు - సాధ్యమాకవిత
వ్యాకరణజ్ఞుని - వలచునేజనకుఁ
నన్నునుఁదార్కికు - నంటబోదెప్పుడు
ఛాందసుజూచిన - ఛండాలుడంచు
దూరమునుండియే - దొలగిపోజూచు
మీమాంసకునిషణ్ణు - మీమాంసజేసి

నిరసించిపోవును - నెమ్మనమందు
సాహిత్యరసికుని - సంతోషముగను
కవితావిలాసిని - కామించితీరు
కావ్యరసజ్ఞుని - కవితాకుమారి
స్వయముగా వలచియు - వలపింపజేయు.
నవరసాలంకార - నైపుణ్యమతియు
నవ్యకావ్యవిచక్ష - ణాగ్రేసరుండు
ఛందస్సు, నాటక - సౌందర్యవేత్త
కావ్యంబు రచియించు - కవియెవ్వడనగ?
బిల్హణమల్హణ - పేరులబరగు
కవివరులిద్దరు - గలరందుగూడ.
సరసుడుకవిరాజు - సాహిత్యవేత్త
బిల్హణుడేయని - పేరొంద్రు బుదులు
వస్త్రంబులన్శుభ్ర - వస్త్రంబుఘనము
ఋతువులందామని - ఋతువెయందంబు
శారదమల్లిక - శస్త సుమంబు
మారుడుత్తమ - ధనుర్ధారవరుండు
కస్తూరిగంధమే - ఘ్రాణయోగ్యంబు
అస్త్రంబులందాది - యస్త్రంబుధనువు
తర్కశాస్త్రసమన్వి - తావాణిరాణి
యౌవనమధ్యయే - యతిప్రియురాలు
యవ్వనమేశ్రేష్ట - మైనవయస్సు
అపవర్గమార్గమం - దాదిశాంకరమె
పంచమలయముతం - బైనదేగీతి

కవులలోనుత్తమ - కవిబిల్హణుండె
బిల్హణునిరీతి - బేర్కొనబుధులు
ఇంతకుముందుమే - మెన్నడుగాని
చూడలేదాతని - సొంపెద్దియనిన
ఇన్నాళ్లకాపురం - బీపురమనిరి
పిలుపుడాతనియునన్ - బిలిచిరాతనిని.
బిల్హణుడేతెంచి - పేరోలగమున
నుపవిష్టుడైయున్న - యుర్వీశుగాంచి
దేవేంద్రునేరీతి - దీపించుగురుడు
యారీతినారాజు - నాశీర్వదించె.
కవిశేఖరాధిక - కళ్యాణమేన?
కళ్యాణమేనిమ - కరుణచేరాజ.
మీకీర్తి వింటిమి - మేముకవీంద్ర
చూడలే వీనాళ్లు - చోద్యమయ్యెడిని
ఎచ్చోటమీరుంటి - రేయూరమీది?
యనన్నృపు, డిట్లనె -

యాకవిరాజు

ఓరాజకాపురం - బున్నదీపురమె
చదువుచుంటినిగురు - సన్నిధిలోన,
కానమీరెట్లునన్ - గనుగొనగలరు
మీదర్శనంబుచే - మేరలేనట్టి
యామోదమందితి - యవనీశనేడు
కవియిట్టులన, రాజు - గౌరవంబుగను
హాటక కేయూర - హారాదికముల

పట్టువస్త్రంబుల - పసిడినాణెములు
యుచితరీతినొసంగి - యోగ్యుడౌకవిని
పంపించెనింటికి - బహుమానితముగ
మంత్రితోనిట్లనె - మనుజేశుడంత
మన్మథుడాకార - మందుననితడు
నవ్యకావ్యోల్లేఖ - నాపాటవమున
సవ్యసాచి, గురుండె - సరిపోల్చదగును.
షడ్భాషలందున - సామర్థ్యమొప్ప
బిల్హణుగనుగొన్న - బేలలుగూడ
పతిసంగమంబును - పాటించబోరు
యీతనిసన్నిధిచే - నేనెవెట్లుగూర్తు
విద్యార్థినిగజేతు - వివరింపుమయ్య
భూలోకసురకల్ప-భూజమైనట్టి
యీతని లావణ్య - మనుపూలగుత్తి
అయతాక్షులమనం - బనుభృంగతతి ని
ఆకర్షణముజేయు - నైసర్గికంతమటుల
మనుజేసుకంతన - మాత్యుడిట్లనియె
కవిరాజురతిరాజు - గాదనియనను
కామినీమణులను - కామింపజేయు
కాని పుత్రికకెట్లు - గఱపింతువిద్య?
మనదేసమందున - మంత్రిపుంగవుత
సరసుడౌకవిరాజ - సాహిత్యవేత్త
యీతండుగాకన్య - డెవ్వండులేడు
ఏమిచేయుదమింక - నెద్దియుపాయ

మెఱఁగింపుకోవిదుం - డీవెయన్నిటను
సార్వభౌమునకంత - సచివుడిట్లనియె
వ్రతములున్నవిరెండు - వారలకందు
గ్రుడ్డివానినిజూడ - గోరదు "తిలక"
కుష్ఠిరోగినిజూడ - గోరండు "కవియు"
కుష్ఠిరోగమునాడు - కొమరి త్తకనియు
గ్రుడ్డివాడనికవి - కూతుకుజెప్పి
నమ్మింపవలె, నట్లు - నమ్మినపిదప
వారికిమధ్యలో - వస్త్రంబుగట్టి
ఒకరినొకరుజూడ - నోపమిభంగి
గావించివిద్యయు - గఱపింపవచ్చు
కార్యసిద్ధియుదీన - గలుగునుమనకు.
అంతమోదంబుతో - ననియెభూపుండు
నీతికోవిదుడన - నీవగాకెవరు
నీవు జెప్పినరీతి - నేజేతునంచు
ప్రియపుత్రికామణిని - బిలిపించెనటకు
మన్మథారాధ్యైక - మంత్రదేవతగఁ
ప్రత్యక్షమైనట్టి - పట్టినిగాంచి
సకలశాస్త్రంబుల - జక్కగానీవు
చదువుము పుత్రికా - చతురతతోడ
జాత్యంధుడైనను - సరసుండుగాన
గురువుగా బిల్హణు - గోరితెచ్చితిని
యాతనియొద్దనే - యఖిలవిద్యలను
నేర్వంగనిప్పుడే - నియమింతుననిన

ఇదియేమినాయనా? – యీనియమంబు
నానియమంబొందు – నడచునుగాదె
జాత్యంధునెప్పుడు – జగతిగన్గొనను
యనిన. సత్తైనచో – నగుపడకుండ
యువనికగట్టింతు – ననెజనకుండు
అందుకామెయు – నంగీకరింప
సకలకళావేత్త – సరగునబిలిచి
కుష్ఠురోగముగల – కొమరితకీవు
అన్నివిద్దెలనేర్పు –
మననాతడనియె

బాగున్నృపోత్తమా! – పలికినదంత
కాని కుష్ఠముఖంబు – గనుగొన ననిన,
కానిమ్ముగవివరా! – కాండపటంబు
కట్టింతు నొండొరు – గాంచనియట్టు.
ఓరాజా యీరీతి – నూరక నన్ను
నిర్బంధమొనరింప – నేనేమిజేతు
వీలైన మాత్రంబు – విద్దెనేర్పింతు
గాదనలేనని – కడకొప్పుకొనియె
అతనిమాటలువిని – యానందమొంది
కవినంపి యటనుండి – గనుగొని సచివు
నీవుచెప్పినయుక్తి – నెరవేరెనింక
ముందటి కార్యంబు – మొదలిడవలయు
సమయజ్ఞులనుబిల్చి – సరభసగతిని
శుభముహూర్తంబును – శోధనజేసి
పరిశుభ్రమొనరించి – ప్రాసాదమంత

యవనిక గట్టించె - నతిసుందరముగ
శుభదినంబున నొక్క - శుభలగ్నమందు
పరిశుద్ధమైనట్టి - భవనాంతరమున
సచివ కవీశ్వర - సామంతప్రభృతి
సకలానుచర మిత్ర - సహితుడైయుండి
బిల్హణు, పట్టిని, - బిలిపింప, కవియు
వాణినారాధించి - వాల్మీకి లిఖిత
రామాయణంబున - ప్రథమసర్గంబు
పారాయణముజేసె - పరితోషమొంది
వివిధదేశాగత - విద్వాంసులెల్ల
ప్రభుదత్త, వితరణ - బహుమానములను
వసుమతీ, వాహన, - వస్త్రాదికముల,
స్వీకరించి గృహంబు - జేరిరంతంత
కన్యకామణికిని - కవికుమారునకు
వరభోజ్యతతికగు - వస్తుజాలంబు
శయనోపవేశ నా - సనములనెల్ల
నుత్తమంబగువాని - నొసగివేర్వేర
తెరకీవలావల - దిరముగానుండి
సకలశాస్త్రంబుల - జదువంగవలయు,
ననిరాజు చెప్పగా - నదిమొదలంటి
నియమంబుదప్పక - నిర్ణీతవేళ
కావ్యనాటక లలిత - కలలు, శాస్త్రములు
సర్వంబు నెఱిగించె - చక్కగానతడు
నవరసాలంకార - నవభావయుక్త

నవ్యకావ్యంబుల - నవనాటకముల
నతిప్రౌఢమైనట్టి - యర్థశాస్త్రమున
స్వచ్ఛవిరాజిత - ఛందస్సునందు
కామశాస్త్రంబున - గలరీతులందు
రాకుమారియె కవి - రాజునుమించె
కాలమీరీతిగా - గడువకొన్నాళ్లు
శారదపూర్ణిమా - సమయంబునందు
కామినీజనకామ - కారకుడైన
''యామినీపతి'' సర్వ - హరిదంతములను
విష్ణుపదంబును - విశదంబుజేయ
ప్రాచీముఖంబున - ప్రాదుర్భవించె
యామినీ కామినీ - యవతంసమటుల
ప్రద్యుమ్నుశరముల - బదునుగావించు
నికషోపలంబన - నింగివెలింగె
కుముదంబు వికసించె - కుసుమాస్త్రుడలరె
అంధకారము పోయె - నాకాశమందు
విరహి జనంబుల - వేదనహెచ్చె
పూర్వాద్రినుదయింప, - పూర్వదిఙ్నారీ
శ్రవణకుండలమైన - చంద్రమండలము
ఉత్పలకలికంబు - లుత్ఫుల్లమయ్యె
ఫుల్లారవిందముల్ - ముకిలితమయ్యె
యువకుల యుల్లంబు - లుద్వేగమొందె
ముగ్ధలమాన ము - న్మీలితమాయె
కౌముదీమోదంబు - గలిగెనంతంత.

ఆశావకాశము - లవఘాతమయ్యె
జక్రవకవతము - జతబాసిపోయె
అంధకారముపోయె - నంబోధిపొంగె
చంద్రుడుజ్జృంభించు - సమయంబునందు
శయ్యాగృహంబున - శయనించియుండి
వాతాయనంబున - భాసించుచున్న
కామినీ సంతాప - కారునీరీతి
వర్ణించె శ్రీఘుమా - వరకవిరాజు
తారాధిపతి! నిన్ను - దాకియున్నట్టి
మచ్చనుకొందఱు - మట్టిచెట్టనిరి
బాలశశంబని - పలువురుబలుక
హరిణంబుగాగొంద - రందురు; కాని,
కాంతాధరంబును - గావించునపుడు
కమలాసనుండు నీ - కడుపులోనున్న
యమృతమునుదీసి - హత్తించెనేమొ
అందుచే నీయందు - నగుపడుబిలము
ఆకాశమిదిగాదు - యంబుధిగాని
తారకలివిగావు - ధవళఫేనంబు
చంద్రుడీతడుగాడు - సర్పరాజంబు
అంకంబుగాదిందు - హరిశయనించె
జలనిధిలోనుంతు - జంబాలమనియు
భూచ్ఛాయయేయిల్లు - పాలుపారుననియు
చంద్ర! నీలోనున్న - ఛాయనుకవులు
పరిపరివిధముల - భావించుచుంద్రు

అదిగాదుగానినే - ననిచెపనిట్లు
రాతిరిరేరాజు - త్రాగినతమము
కడుపులో నున్నదై - కనుపించునట్లు.
తూరుపుదిక్కున - తోచెరాగంబు
భయపడిరెడబాసి - భామలుపతుల
అంబోధియుప్పొంగె - నత్యంతముగను
నీరేజతతియును - నిద్రనుబొందె
కుముదముల్ ముదమొందె - కోకంబులేడ్చె
ఆశావకాశంబు - లవకాశమొసగె
కాంతిమంతంబయ్యె - గగనభాగంబు
శర్వరీతమసంబు - శమియించిపోయె
వెన్నెలపులుగులు - వెలువడెనంత
దర్పంబుజెందె కం - దర్పుండుమెండు
సోముని కిరణముల్ - సోకినయంత
చంద్రమండలమును - జాలంబునుండి
వసుమతియనుసౌధ - భాగంబునందు
దూరినమన్మథ - ధూర్త చోరుండు
ముగ్గలమానంపు - భూషణములను
దోచుటకై మోహ - ధూళినిదిశల
చల్లెనుబోయన - చంద్రికయొప్పె
శారదగగనంబు - శాణంబుగాగ
చంద్రుడురాశియౌ - చందనమనగ
గంధంబుకైగల్గు - కస్తూరిబోలె
నంకముశోభించు - నతిసుందరముగ

ఆకాశకూపాది - తాంభోరుహంబు
స్మరసాయకంబుల - శాణోపలంబు
సంధ్యేందిరామృదు - శయకందుకంబు
చూచితేసుందరి? - సోమబింబంబు.
కవియిట్టులన. విని - కన్యకామనియు
నంకంబునేరీతి - నంధుండుజూచు
పరులుజెప్పినవిన్న - వర్ణించుటెట్లు
యింతకుమించిన - దేమిటివింత
మాతండ్రిజేసిన - మాయయోయేమొ
కనుగొందు కవివరు - గాఁబుండొగాడొ
వ్రతభంగమగునను - భయమేలనాకు
యనితలపోసియు - నంతనుండకయె
శయ్యాతలంబున - చక్కగానిలచి
కాండపటంబుపై - గడ్డంబుమోపి
హస్తద్వయంబున - కావలయున్న
యుజ్వల జాలమం - దుపవిష్టుడైన
కవికిశోరుని గాంచె - కన్యాలలామ
కందర్పదర్పంబు - గడద్రోయజాలు
కవిరూపురేఖల -గాంచినతోడ
మన్మథభావంబు - మనసులోగల్గి
నిర్నిమేషంబుగా - నిలిచినదటులె
అంతబిల్హణు డుద - యాద్రిపైబొల్చు
ప్రాలేయకిరణుని - భాతిభాసించు
తెలిమీదనున్నట్టి - తెలివముఖంబు

గను గొని మనమున - కలవలపడుచు
ముకురమొ పద్మమొ - ముఖమొ? చంద్రుండొ
చేడియ కన్నులో? - చేపలొ గాక
పద్మంబులో పంచ - బాణుబాణములొ
కుచములొ! ఖగములొ! - కుసుమగుచ్ఛములొ!
కనకకుంభంబులొ - గాకయన్యములొ!
మెఱుపొ! నక్షత్రమొ! - మిహిరాంశుకళయొ!
కనకంపులతికయొ! - కన్యకామణియొ.
కాదుముఖంబిది - కాదుపద్మంబు,
ఏణాంకముక్తమౌ - యిందుబింబంబు.
కావుకుచంబులు - కావుగుచ్ఛములు,
పీయూషపూరిత - పృథులకుంభములు.
కావివి ముంగరుల్ - కావుతుమ్మెదలు
మారనారాచంపు - మందిరమగును
కావివి కన్నులు, - కావుమీనములు,
యువకుల బంధించు - యుక్కుసంకెలలు
చీకటిగుంపులు - చేడియకురులు
బంబరబృందమీ - బాలికాలకలు
నెలవంక, నెఱజాణ - నెన్నొదురెన్న
కోమలిభ్రూతితల్ - కోదండయుగళి
కోకనదపత్రంబు - కోమలిపెదవి
శంఖంబు కంఠమా - చతురభాషిణికి.
కుంభంబులాబాల - కుచములజంట.
అయతాక్షికిమధ్య - మన్తరిక్షంబు

సారసాక్షిక్రోణి - సైకతశ్రేణి.
మానినికరములు - మాధవీలతలు.
అరటిబోదెలబోలు - నంగనతొడలు.
కాహళికంబులు - కాంతజంఘములు.
పాదముల్ చదలేటి - పసిడిపద్మములు.
సర్వసౌందర్యంబు - సమకూర్చిధాత
భవదగ్ధమదనుని - బ్రతికించుచుండె
మనసుకుచంబుల - మధ్యకుబోయి
రాలేదుపాలిండ్లు - రాపిడివలన
నాశనమయ్యెనొ - నలిగెనొయేమొ
విరహాగ్నిలోబడి - వేగినదేమొ
తరుణిలావణ్యామృ - తంబునబడెనొ
యవ్వనవనమున - యాత్రగావించు
మారచోరుండేమొ - మాయగావించె
ఆతన్విముఖకాంతి - యలరుచునున్న
చందురుపరివేష - సౌందర్యమేల
కన్నులకథజెప్ప - కలువలెందులకు
వల్లకిరవమేల - పలుకులువిన్న.
బిల్హణువాగ్ఝరి - పీయూషమందు
మునిగి యాబాలిక - మోహంబువాసి
కవిచంద్రుముఖమును - గనుగొనిమరల
దలవంచి సిగ్గుచే - దలబోసెనిట్లు
దుష్ఫలస్వాంతనై - దోషమొందనక
గవయనుంకించిన - గడద్రోయునేమొ

యాతనిమనమెట్టు – లరయంగనగును
యనిదలబోసియు – వ్యాకులపడుచు
కాండపటంబును – కవినియువదలి
పడిపోయి నిలువున – పడకపై యపుడు
కామసంతప్తయై – కాంతియపడుచు
రక్షింపురతిరాజ! – రక్షింపుమనుచు
యెలుగెత్తిపలవించె – యెలనాగతిలక
వగపేల. జవరాల! – వంతనీకేల
నీకటాక్షంబుచే – నేగాయపడితి
ఆగాయములుమాన – నౌషధంబీవె
అధరంబులోనున్న – యమృతంబురసము
కుచములపైనుండు – కుంకుమపూత
కరుణించి యొసగిన – గడతేరగలను,
కవివరుసమ్మతి – గనుగొనితిలక
మోహంబుజెంది యా – మోదంబునొంది
కాండపటంబును – కడకుబోద్రోచి
బిగికౌగిటంజేర్చె – బిల్హణకవిని.
నీవినివిప్పంగ – నేలేదుగాని
సడలితనంతనే – జఘనంబువీడె
కంచుకంబునువిప్ప – గా నెంచలేదు
ముందుగా భిన్నమై – ముడివీడిపోయె
ముఖమునుజూడంగ – మోమెత్తలేదు
అవలోకనముజేసె – నదియెమున్ముందు
ప్రీతాతిశయమును – విఫలంబుజేయు

భావపరంపర - ఫరిఢవిల్లినడి
ఒరగన్నులజూడ - కారణమేల
నానందవారిధి - నవగాహమొందె
వేడుకమాటల - వినిపించురీతి
కర్ణాంతరంబున - కరిగెనుగాదె
బిగికౌగిటంజేర్చి - బిత్తరియంత
మన్మథవివశయై - మనసులోదూరె
అధికానురాగంబు - నందుచుగూడి
యాతనిలోనైక్య - మయ్యెనుగాదె
మ్రోయుకంకణముల - మొత్తంబుగల్గి
సంతోషమొందిన - సకలాంగకముల
పులకాంకురంబుచే - బోధితానంగ
భావంబుగల్గిన, - భామకుచంబు
లురముపైమోపి,వి - యోగార్తు గాథ
బాహుపాశంబుల - బంధించివైవ
నాతని సుఖమింత - యనరాదుసూవె
కొప్పులోనున్నట్టి - క్రొవ్విరుల్ జారె
మందమందంబుగా - మధ్యంబుగదలె
మోమునజెమటలు - మొలకలువేసె
కన్నులుమెలమెల - గదలుచునుండె
గొంతు కపోతంబు - కూతనువేసె
చనుగవ మిక్కిలి - చాంచల్యమొందె
మీనేక్షణముట ని - మీలితమయ్యె
వక్త్రంబుపై వాల - భారంబుగదలె

నడుమునలోతైన - నాభిచెన్నొందె
పురుషాయితమునకు - బూనినయపుడు.
తటిదంతనంతట - తాండవమాడె
చంద్రుండు ఘర్మాంబు - జాలంబువదలె
వాపిదములు సుమ - వర్షంబుగురిసె
తారహారము విడె - తారాపథంబు.
పదనుబెట్టిన కర - వాలంబు భంగి.
మజ్జనమొనరించి - మగువవెలింగె,
శారదచంద్రికా - శర్వరీభాతి
బాసించెపరిశుభ్ర - వస్త్రంబుగట్టి
కరపల్లవంబున - కభరీభరంబు
పట్టినయారాజ - పట్టి. శృంగార
క్షీరాబ్ధిబోధమిన - సిరియననొప్పె.
శయనించియున్నట్టి - జంపతీవరుల
ప్రణయకోపంబుతో - ప్రథనంబుగాగ
విముఖంబుగల్గియు - విరహంబుగల్గె
మన్మథోద్రేకంబు - మదిజనియించె
అయ్యయో కలుపుట - కాళియులేదు
పాపముగదలదు - పానుపుగూడ
ఆస్థితిలోవారి - యాచ్ఛాదనంబు
పుణ్యమాయనిగల్గె - పొత్తువారలకు
కోపించితీవని - కొమ్మ! నామీద
నిరశనవ్రతమును - నేజేయుచుంటి
పలుకవానితిముందదె - పరభామకథల

నీకునాపైయంతో - నెయ్యంబెబాల
ఏలచేసితివిప్పు - డింతియీగోల
దానునిమీద నీ - దయదప్పెనేని
దిక్కులుశూన్యమై - దీపించులలన
రాగంబునకు నంత - రాయంబుగల్గ
ననురాగమంతకు - నభివృద్ధిజెందు
ప్రణయంబుమిక్కలి - ప్రబలమైపోవు
యొండొరులెడబాసి - యోర్వంగలేరు
విడదీయదనువులు - వేరౌనుగాని
మనసులోమనసైక్య - మైపోవుగాదె.
కొన్నాళ్ళు క్రీడలు - కొనసాగనేమొ
దాసీజనంబుచే - ధరణీశ్వరునకు
వీరిసంపర్కంబు - విదితంబుగాగ
క్రోధతామ్రాక్షుడై - గూతుతోననియె.
శౌర్యసాహసధైర్య - సౌందర్యయుక్త
సద్వంశసంజాత - సార్వభౌమునకు
ప్రీతితోనిన్నిచ్చి - పెండ్లిగావించి
ధన్యతనొందంగ - దలచితిగాని
నావంశకీర్తిని - నాశంబుజేసి
మంటగల్పెదవని - మదినెంచలేదు
అపవాదు పాల్జేతు-వనియెంచలేదు
చెప్పనదేమింక - చేయునదేమి
సర్వంబునాశంబు - సలిపితివనిన.
ధైర్యంబుగాబాల - తండ్రినిజూచి

నాయనా దోషంబు – నాయదిగాదు
కపటంబుతోమీరు – కట్టించినట్టి
కాండపటంబె మా – కళ్యాణపటము
పరితాపమింకేల – పరిణయమయ్యె
''పతియాతడే"యని – పలికిన దంత
ఆమాటలనువిని – యవనివిభుండు
పుత్రికాపోనిమ్ము – పూర్వకృతమ్ము
తప్పిదమైనను – తనయవుగాన
మన్నింతు దానిని – మఱచిపొమ్మింక
సుగుణవైయుండుము – సుందరుడైన
ప్రభుకుమారునకిచ్చి – పాణిగ్రహంబు
గావింతుననిన నా – కన్నియ నుడివె.
ప్రియపితా! వినుమునా – విన్నపమింక
జ్ఞానేంద్రియంబును – నయనేంద్రియంబు
ఘ్రాణేంద్రియంబును – రసనేంద్రియంబు
స్పర్శేంద్రియంబును – శ్రవణేంద్రియంబు
సర్వంబు కవివశ – స్వాధీనమయ్యె
హృదయశూన్యంబగు – రిక్తదేహమును
ఎవ్వరికి నిచ్చిన – నేమిలాభంబు
యనిన రోషంబుతో – నటనుండిలేచి
వేగంబుగా సభా – వేదికజేరె.
భద్రాసనంబున – బరగిభూపుండు
కోటిపాలుండను – కొత్వాలుతోడ
బంధించి బిల్హణు – పాపమొందనక

శిరమును ఛేధించు - శీఘ్రుంబె యనియె.
ఆగ్రహానుగ్రహా - లన్నియుమీవె
రక్షింప శిక్షింప - రాజులేఘనులు
అన్యుడెవ్వండైన - యసమర్థుడగును.
ప్రభువరా! మీయాజ్ఞ - పాటింతుగాని,
వేరుగాయెంచక - వినుడువిన్నపము
సాహసంబునకిది - సమయంబుగాదు
యోచించిచేయుట - యుచితంబుదేవ.
ఆమాటలకు ప్రభు - వగ్నియైమండి
కోటిపాలునిపైన - కోపంపుజూపి
పొమ్ముమాటాడక - పొమ్మంచుదరిమె.
పాపమాతండును - బంధించి కవిని
కాటికిగొనిపోయె - ఖండించుకొరకు
అంగనామణి భవ - నాంగనమందు
శృంగలాబద్ధుడై - చెలికాడుపోవ
కన్నీరు గార్చుచు - గడపలోనుండి
జాలిచూపులజూచి - చాన వాపోవ.
బాలికా! చాలిక, - పరితాపమేల
ద్వారంబు నందుండి - దారికడ్డోవు
సిగలబద్ధుండైన - నీప్రియుమీద
కలువరేకుల కన్ను - గవనుండిదృష్టి.
ప్రసరింపజేసిన - ఫలితంబుగలదె.
దేవతాస్త్రీజన - దృగ్గాలముందు
క్షణములోబడిపోవు - సఖుడునీదరికి

రాలేదు రాలేదు - రాయంచగమన.
వధ్యవేదిక కేగి - వరకవిరాజు
ఆశలేశములేని - యవలోకనముల
దీనాతిదీనుడై - దిక్కులజూచి
మందహాసముజేసి - మగువనుదలచి
అనతుడై ప్రభు - వానతినెంక
కానిమ్ము భద్రుడా! - ఖండించుమనియె,
బిల్హణకవివరా! - భీతియేలేక!
మందహాసముజేయ - మనసెట్టులొప్పె.
వికసితవదనార - విందయౌ దేవి
నాహృదయంబులో - నాట్యంబుజేయ
భయమేలగల్గును - భద్రుడా వినుము.
కామాతిశయముచే - కడుశోభజెంది
చెక్కిళ్ళపై తొలుక - చిరునవ్వుతోడ
కఠినపీనోత్తుంగ - కరికుంభతుల్య
కుచహారశోభచె - గూడినయట్టి
మహిళనుదలచెద - మనసారనిపుడు.
కనకచంపకహార - గౌరవర్ణంబు
వికచాంబురుహనేత్ర - విలసితాననము
రాజితనవరోమ - రాజియుగల్గి
నిదురించి - మేల్కొని నీల్గునెచ్చెలిని
సురతాలసాంగియౌ - సుందరీమణిని
గళితవిద్యనుబోలె - కడుమదిదలతు
తీర్చినకస్తూరి - తిలకఫాలంబు
వనజాంతరస్థిత - వర్ణంబుగల్గు.

మందప్రసారిత – మదిరాక్షియైన
కాంతాముఖంబును – కనుగొందునిపుడు.
కర్ణకుండలకాంతి – గండంబురాయ
నుపరతిజేయంగ – నుత్పన్నమైన
సాంద్రముక్తాఫల – శ్రమజలంబొప్పు
తరుణిముఖంబును – దలచెదనిపుడు
యామినీపతిముఖి – యౌవనారూఢ
ఘనపీనకుచ భార – కచభారలసిత
మదనశరానల – మథితాంగతతిని
శీతలమొనరించు – స్త్రీగనిపించు.
రాత్రినేతుమ్మిన – రాజకుమారి
ప్రణయరోషంబుచే – పలుకుటమాని
మంగళవచనంబు – మారుగా నాడు
చెవియందుదగిలించె – చెవిపోగులపుడె
మనసుననేటి కి – మరుపురాదదియు.
ఉత్తుంగపీనప – యోధరఖిన్న
కమలాయతాక్షని – గాంచుభాగ్యంబు
కలిగిన నొకవేళ – కడకిప్పుడైన
ఆలింగనముజేసి – యానతీరంగ
సారసంబునుమత్త – షట్పదంబటుల
నాస్వాదనముజేతు – నధరామృతంబు.
కోమలశ్యామల – కుటిలాలకముల
శతపత్రపత్ర వి – శాలనేత్రముల
పీవరకుచభార – పీడితాంగముల

అధ్యాపకోక్తమౌ - యర్థంబులటుల
చింతనజేసెద - చిత్తంబులోన.
సజ్జనకృతమగు - సాహాయ్యములను
మఱువకదలచెడి - మాన్యనికరణి
మల్లెమొగ్గలదంత - మాలికతోడ
చంచలలోచనాం - చలదృష్టిచేత
వెలుగుముఖంబును - వేమారుదలతు,
పద్మంబుపైనున్న - భ్రమరంబులటుల
మోమునవ్రాలిన - ముంగురులుండ
కర్ణంబులందున - కమ్మలవెలుగు
యాననంబున బ్రాకు - యతివనుదలతు.
మెడనొకించుకవంచి - మృదుపాణితలము
కటియందుమోపుచు - కచగంటితోడ
దాపలజడవ్రాలు - తలవాల్చినాకు
చూపుప్రసాదించు - సుందరిదలతు,
పొంగారుబుగ్గలు - పొడవైనముక్కు
పరిపూర్ణచంద్రని - భాననకాంతి
యనుభూతపూర్వమౌ - యంగనాంగముల
మఱిమఱిదలచెద - మనసుననిపుడు
నేరకయొకనాడు - నేరంబుసలిపి
మన్ననకై నాదు - మానంబువదలి
పాదముల్ బట్టిన - పలుకకయున్న
వస్త్రాంచలముబట్టి, - వదలించుకొనుచు
పొమ్మంచుయేడ్చెడు - పొలతినిదలతు,

సువిశాలసైకత - శ్రోణిభాగమును
గంభీరనాభిని - గగనమధ్యముసు
నవమృణాలసమాన - నయబాహువులను
గజగమనంబు ను - గనులారజూతు.
సరససంభోగంబు - సాగించుచుండి
యానందముసుజెంది - యలసటచేత
కనుల నిమీలించి - గసపెట్టుచున్న
కాన్తాముఖంబునా - కనులలో మెలగు.
అపరాధమొనరింప - నలిగినామీద
కన్నీరు మున్నీరు - కాల్వలైపార
పలుకుటమానియు - వగపాపలేక
కోపంబుచేలోన - గ్రుంగుచునుండి
వేడినిట్టూర్పుచే - పెదవిశుష్కింప
పలవించుబాలను - పలుమారుదలతు,
తొందరపాటుతో - తోయజవదన
చీరెను దొలగింప - సిగ్గునుజెంది
ఒకచేతనాభి వే - రొకచేతయోని
నాచ్ఛాదనముజేయు - నబలనుదలతు,
ఏకాంతమున కాన్త - యేమేమొదలచి
ముకురంబునం దన - మోముజూడంగ
వెనుకనేబోవగా - వెక్కిరింతాడి
లజ్జచేదలవంచు - లలననుదలతు,
గండంబులందలి - గంధమువలన
పద్మాశచేవ్రాలు - బంబరములను
కనులుమూయుచుకేలి - కమలముతోడ

నదలించుచుండెడి - యతిపనుదలతు.
పరిహాసమున కింట - పైకేగివాగఁ
లోలాక్షివెలుపల - లోపలదిరిగి
వెదకికానకయున్న - వేసారితుపకు
నిలుచుండిచూపుల - నిగిడించుచున్న
కన్నులుగదులునా - కనులలోనిపుడు.
ద్వారంబుచాటున - దాగినయపుడు
ఆననంబును కర - మందునమోపి
"ఎటుకేగెనోప్రియు . డేలరాడంచు"
పాటలబాడెడు - పడతినిదలతు.
చేరకుసరిపోయి - చెవివరకున్న
కన్నులుగల్గిన - కామినీముఖము.
మన్మథతాపము - మాన్పగజాలు
తరలాక్షిచూపులు - దలపునగలవు
ఆసుకుమారిణి - యందంబుజూచి
కరమున కుచకచ - గ్రహణముజేసి
ఆవేశముననామె - యధరంబగొఱక
పంటినొక్కులబాధ - భరియించలేక
"యిస్స"ని శబ్దించు - యింతినిదలతు.
బింబారుణంబగు - పెదవిభాగమున
ధవళదంతపుకాంతి - తాండవమాడ
మధురసుధారస - మాధుర్యమొప్ప
బిలిబిలిమాటలు - జెప్పుచున్నట్టి
మధురవాణిమృదూక్తి - మనసులోమెలగు.
కర్ణంబులందున - కనకపత్రములు

యున్నతకుచముల - యుపరిహారంబు
కటియందుకాంచన - కాంచీగుణంబు
అగ్రములశబ్దించు - యందియలొప్ప
లాస్యంబుజేసెడి - లలనసుదలతు.
మెడయందుచేతుల - మెలవేసినాదు
వక్షస్థలంబుపై - పాలిండ్లుమోపి
యానందమునదన - యక్షులుమూసి
యధరంబునానెడి - యతివనుదలతు.
కంధరమునుద్రిప్పి - కామంబుచేత
నుబుకు చన్గవనుండి - యురలహారములు
కేశపాశమువీడి - క్రిందికిజార
ఒయ్యారముగజూచు - ఒయ్యారిదలతు.
ప్రియురాలుచేతులేల - పైకెత్తి వ్రేళ్ళ
పెనవేసికాయంబు - విఱచుచున్నపుడు
కరములుమండలా - కారంబుగాగ
సపరివేషశశాంక - సౌందర్యమొప్పు
కామినీముఖము నా - కనులలోమెదలు.
ఇంతికోపించి నే - నెంతవేడినను
మానకతాపము - మంచముమీద
పెడమొగంబునుబట్టి - బెదిరించినన్ను.
నిదురించి మేల్కొని - నిద్దురలోన
తిరిగినరీతిగా - దిరిగినామీద
చేయివేసినయట్టి - చెలినిదలంతు,
ఉపరతిజేయంగ - నుద్యుక్తయైన
ముగుదముంగురులెల్ల - మోమునవ్రాల

ఆయాసమున కోమ - లాననమందు
శ్రమబిందుజాలంబు - జాలువార
నిలకడలేకయే - నిట్టూర్పులెగయ
మందహాసముతోడ - మాటాడునట్టి
భామనుదలచెద - భావంబులోన
ఎచ్చటికైననే - నేగిరాకున్న
విరహవేదనతోడ - వేచినాకొఱకు
కంకటిపైబడి - కడుదొర్లిదొర్లి
యంతటనుండక - యటనుండిలేచి
ద్వారంబులోనిల్చి - దారులుజూచి
చెలిచెంతదుఃఖించు - చిన్నారిదలతు.
వాకిటనుండి నే - వచ్చుటగాంచి
దొంగనిద్దురబోవు - తొయ్యలిమేన
గండంబులందున - కరమునునిమిర
పులకకంచుకితయౌ - పూబోడిదలతు,
యోనినిదర్శింప - నుబలాటపడుచు
చెఱుగునుదివియగా - చేతులతోడ
లాగుచుమూతిని - లజ్జచేముడుచు
వామలోచనమెల్లు - భావంబులోన,
రతికేలిసల్పిన - రాత్రి, నిద్రించి
తెల్లవారినతోడ - దెఱచినేత్రములు
యంగభంగముజేసి - యదరంబుదాకి
కాటులఱడవెడి - కమలాక్షిగొల్తు.
భవనంబుపైనుండు - ప్రాకారమందు
నుపవిష్టయైయున్న - యువిదనన్జూడ

అంతరంగికసఖి - హసియింపగానె
మెల్లనదలవాల్చు - మెలతనుదలతు,
సాపరాధుండనై - సఖిచెంతకేగ
నలుకతోనెమ్మొగ - మావలద్రిప్ప
నాలింగనముజేసి - యనునయించినను
యంకురితాంగియై - యసహించుకొనుచు
వద్దుపొమ్మనిజెప్పు - వనితనుజూతు.
ఎగతాళిగాచెలు - లెవ్వరువీరన
దరహాసవదనయై - దర్శించినన్ను
ఎవ్వరోవీరు నే - నెఱుగనేయంచు
ప్రత్యుత్తరంబిచ్చు - రమణినిదలతు,
యానంబుచే రాజ - హంసయానంబు
కంఠంబుచే కల - కంఠికంఠంబు,
కేశపాశంబుచే - కేకిపింఛంబు
పరిహసించుచునున్న - పడతినిజూతు
పాన్పుపై హాయిగా - బవళించినపుడు
ఆననంబుననాదు - యధరంబునుంచి
పండ్లతో నొక్కుచూ - పట్టితొట్టొడ
నానందమున దన - యంగంబులాన
నాలింగనముజేసి - యల్లెనిద్రించు
మోహినిరూప మా - మోదంబుజేయు,
మదనోత్సవమునకు - మన్మథరాణి
పరెె సఖీసహితయై - వనితయేతెంచి
యుద్యానవనములో - నుయ్యాలపైన

నూగుచు హాయిగా - నున్నట్టులుండి
లోకాపవాదంబు - లోనుగాకుండ
ఓరజూపులజూచు - నువిదనేదలతు.

విజనంబుగానున్న - వేళలయందు
త్రివళులువీడగా - దేహంబుసాచి
స్తనములుపైకేగ - దనువునువిఱచి
నవరోమరాజితో - నాభికన్పడగ
నుద్రేకమొనయించు - నువిదనుదలతు.
ఆ నళినానన - యరగంటిచూపు
మృదుమధురంబగు - మేలిమిపలుకు
లీలాలసంబైన - లేమయానంబు
మందస్మితంబును - మనసునగలవు.

వేణి శ్రోణులమీద - వ్రేలాడుచుండ,
లోలార్ధమీలిత - లోచనంబులను
పరిసరంబులనెల్ల - ప్రసరింపజేసి
సురతంబునకుదగు - సుందరియనగ
వాహ్యాళికేగెడు - వాల్గంటిజూతు
ఒడిలోనవ్రాలిన - పడతిముంగురుల
సరిజేసిమెల్లగా - చనుగవమీద
హస్తంబులనుమోపి - యదుమగానన్ను
కోపంబుతోజూచు - కోమలిజూతు,
అలింగనముజేయు - నాశతోరాగ
వద్దువద్దనినేను - వారించిచెప్ప
అప్పటికోపమా - యపరాధమంచు

ప్రతిమాలుకొనునట్టి – భామనుదలతు
ఆతన్వీముఖగంధ – మానుటకొఱకు
తుమ్మెదల్ రొదతోడ – తొందరపడగ
స్పర్శశబ్దంబుల – సహియింపలేక
కరపల్లవంబును – గదలించుచుండ
మ్రోగుకంకణములు – మ్రోతలవిందు,
యవ్వనోదయకాల – మాదిగానన్నె
ప్రాణనాయకునిగా – వరిగనించుచును
ప్రేమతోనున్నట్టి – ప్రియురాలుతోడ
సంగమంబిటుపైన – జరుగకయున్న
జన్మాంతరంబున – జరుగుటకొఱకు
చింతనజేసెద – జీవితేశ్వరిని,
ఏలమాపైబ్రహ్మ – కింతకోపంబు
ఈజన్మలోనింక – నిదెశివరాత్రి
అంతయునిక్కడే – యంతమైపోయె
కాని రాబోయెడి – కాలంబునందు
దయజూపనిప్పుడే – ధాతనుగొలుతు.
కాలకూటంబును – కంఠంబునందు
శివుడెంతకాలంబు – జేర్చియుండు
అంతంబులేనియీ – యవనిభారమును
మూపునకూర్మంబు – మోయునెందాక
బడబాగ్నినెందాక – పాలసంద్రంబు
తనలోనవిడువక – ధరియించియుండు
అంగీకరించిన – యాజ్ఞనందాక

పాలించుచుండురు – పండితవరులు,
నాదేహమిటుపైన – నాశనమైన
కానిమ్ము బ్రహ్మ! నీ – కసిదీరిపోవు.
పంచభూతంబుల – భాగంబులన్ని
వానిలో వానివి – వరుసగాజేరు
నారీతిజేరెడు – యంశంబులన్ని
నేనుజెప్పినయట్టి – నియమంబుగాను
జలభాగమాబాల – జలకంబులాడు
పావనంబగునడ – భావులయందు
అగ్నిసంబంధమౌ – యంశంబులాయె
ముఖమునుజూచెడు – ముకురంబునందు
ఆకాశభాగమా – యంగనయుండు
ప్రాసాదప్రాంగన – ప్రాంతంబునందు
పృధివివిభాగంబాయె – ప్రేమతోదిరుగఁ
ప్రమదవనంబేగు – వర్త్మంబునందు
వాయువాబాలిక – వ్యజనంబువీవ
మందంబుగావీచు – మారుతమందు
జేరగబ్రహ్మ! నే – చేతులుమోడ్చి
భక్తితోనిప్పుడు – ప్రార్థించువాడ
వాలభారమువీడ – వదనంబువాడ
కుచములల్లలనాడ – కోపంబుతోడ
నధరంబుకంపింప – నార్తనాదమున
ఎవ్వరెవ్వరినెట్లు – యేమేమియనునొ
ఆశనిరాశయై – యవనిపైద్రెల్లి
ఎంతగాయేడ్చునో – యంతినాకొలకు,

వగచుచు కవియిట్లు – వర్ణించుచుండ
వినలేకవాకలు – వేగంబెబోయి
వినయంబుగావారి – విషయంబులన్ని
జెప్పిక్షమాపణ – జేయుడటన్న
రాజు వారల యను – రాగంబుజూచి
గతకోపుడై జాలి – గల్గి యాతనిని
కరుణతోరప్పించి – కౌగిటజేర్చి
కన్యకాతురునిచ్చి – కవికుమారునకు
వహ్ని సాక్షిగామహా – వైభవంబుగను
పరిణయంబునుజేసి – పట్టంబుగట్టి,
విప్రయోగమునకు – వీడ్కోలుజేసి
ప్రబలినమన్మథ – భావంబుచేత
నాతురుండైకవి – యతివనుజేరి
ప్రథమయామమునందె – ప్రణయంబుజూప
ప్రముదితచిత్తయై – పలికెనుబాల
ప్రియసఖా! తాలుము – వేగిరపడకు
ప్రజలుమేల్కొనియుండ – పైబడదేల
దేదీప్యమానమై – దీపంబువెలుగు
కౌతూహలంబుతో – గాంతురుసఖులు
తాలుముకొంచెము – ధైర్యంబుతోడ
అకలిగొన్నవా – రన్నంబుజూడ
రెండుచేతులదిందు – రే యెవ్వరైన
ఆడుచుపాడుచు – హాయిగానిట్లు
కన్యకామణియును – కవికిశోరుండు
రాజు సంతోషింప – రంజిల్లప్రజలు
పాలించుచుండిరి – పరమేశుకృపను ★